## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ భాద్రపద శు॥ షష్ఠి 1947 సం॥ సెప్టెం॥ 20 శనివారం శు॥ షష్ఠి రా 8-23 అనూ రా10-16 వర్జ్యం తె 4-26 ల

శు॥ సప్తమి సెప్టెం॥ 21 ఆదివారం ఆ॥ సప్తమి రాత్రి 10-9 జ్యే రా॥ 12-38 శేష వర్జ్యం 6-11.

ఆంధ్రపత్రిక

సర్వజిత్ సం॥ భాద్రపద శు॥ షష్ఠి శనివారము

# పంపక బాధ్యత వదలరాదు

ఆహారమంత్రి డా॥ రాజన్ గారి ప్రకటనగురించి ఇంతవరకు జరిగిన శాసనసభా చర్చలవల్ల ప్రస్తుత క్లిష్టపరిస్థితిని దాటుటకు విస్పష్టమైన మార్గము బయటపడలేదు. కాని రేషను పద్ధతిని రద్దు చేయకూడదని సభ్యులందరు దాదాపు ఏకాభిప్రాయమును వెల్లడించిరి. ఈ విషయమున, ఆహారశాఖామంత్రి అభిప్రాయమునకు శాసనసభ అనుకూలముగ లేదని వెల్లడి అయినది.

ప్రభుత్వ రక్షణ అవసరమైన లోటుజిల్లాలలోని, పట్టణములు, పారిశ్రామిక ప్రాంతములు, తదితర లోటుప్రాంతములకు రేషను ఇచ్చు బాధ్యతను పరిమితి చేసికొనిన చాలునని ఆహారమంత్రి సూచించెను, అందుకని, మలబారులో తప్ప,గ్రామముల రేషనింగు పద్ధతిని రద్దుచేయవలెనని, మిగులుజిల్లాలందలి పట్టణములలో ఉన్న స్టాట్యుటరీ రేషనింగును రద్దుచేయవలెనని సూచించెను. స్టాట్యుటరీ రేషనింగు అమలునందున్న ప్రదేశములందు రేషను కావలసినవారందరికీ బియ్యము సప్లయిచేయవలసిన బాధ్యతను ప్రభుత్వము వహించవలసియున్నది.

ఆహారశాఖమంత్రి తన సూచనకు ఈ క్రిందికారణములను తెలిపెను: "కాలనిర్ణయ మనునది లేక పదేపదే ధాన్యము ఇవ్వమని ప్రజలను ప్రభుత్వము కోరుట మూలమున ప్రజకు విసుగు కలుగుచున్నది" అదీకాక "ప్రభుత్వము, ఎల్లకాలము ప్రజలకు ఆహారమును సేకరించే ప్రత్యక్ష బాధ్యతను వహించజాలదు. ఎపుడో ఒకపుడు మామూలు పంపక విధానమును అమలుజరుపవలసి యున్నది. కాబట్టి దానిని ఎంతతొందరగ అమలుజరిపిన అంతమంచిది."

ఆహారమంత్రి సూచనలో నితరలోపము మాట అటుంచినప్పటికీ, రేషనునుసాగించి, పంపకమునకు ప్రభుత్వము బాధ్యతవహించవలెనన్న ప్రాంతమునకు ఆహారధాన్యమును సేకరించుటకు ఏ విధానమును అవలంబించెదరో తెలియజెప్పలేదు. ఆ ప్రాంతములకు సరఫరా చేయుటకు కూడ ప్రజలను అడుగవలసియేయున్నది. సరకు లోటువల్ల పంపకము సరిగా జరగని కారణముననే రేషను పద్ధతి అమలుజరుపబడినది. ఇపుడు దానికి ఉద్వాసనము చెప్పిన పరిస్థితి మొదలుకే వచ్చునుకదా? ఇపుడు మిగులు జిల్లాలందుకూడ సేకరణ జయప్రదము కాకపోవుట వలన, ఆ జిల్లాలోని లోటుప్రాంతములందుకూడ ఆహారధాన్యమును సరఫరా అగుటలేదు. ఇక తదుపరి జిల్లాలకుగాని అక్కడి ముఖ్య ప్రదేశములకుగాని సప్లయిచేయుటకు సునాయాసముగ సాధ్యమగునా! సేకరణ జయప్రదమగుటకు ప్రభుత్వము తగు విధానమును ఆలోచించి నిర్ణయించి దానిని అనుసరింపవలెను గాని అసలు బాధ్యత వదలుకొనిన ఏమాత్రము ఉచితము కాదు. సాధారణ పద్ధతులు భగ్నమగుటవల్లనే, ప్రభుత్వము, సేకరణ, రేషనుబాధ్యతలను వహించవలసి వచ్చినది. పరిస్థితి క్లిష్టముగ నున్నదని ఒకవంక చెప్పుచూ ప్రభుత్వము తానిదివరకు వహించిన ప్రథమకర్తవ్యమును విస్మరించవలెననుట కేవలము సాహసము. సేకరణ జయప్రదము కాకపోవుట వలన ఏర్పడిన నిస్సహాయత నిస్పృహను పురస్కరించుకొని ఆహారమంత్రి తన సూచనను చేసి వట్లున్నదిగాని, వేరుకాదు. ప్రభుత్వము తన నిర్వహణాభారమును వదలినంత మాత్రములో పరిస్థితి దానంతట అది చక్కపడదు. బెంగాలు క్షామసందర్భమున ఎట్టి విధమైన బాధ్యత వహించలేదనే కదా ఆ రాష్ట్రప్రభుత్వమును, కేంద్ర ప్రభుత్వము గర్హించినది! కాబట్టి ప్రభుత్వము పంపక బాధ్యతను వదలుకొనుటకు వీలులేదు. అవసరమైన పంపకబాధ్యతతోబాటు ఉత్పత్తి బాధ్యతను పరోక్షముగనూ ప్రత్యక్షముగనూ వహించవలసి యున్నది. ముందు సంవత్సరముకూడ దిగుమతులు హెచ్చు అవకాశము కనుపడలేదు. అందువల్ల ఉత్పత్తిని ఇనుమడింపచేయుట తప్ప గత్యంతరము లేదు. అధికాహారోత్పత్తి కార్య విధానము నూతన పరిజ్ఞానముతో నడుపవలసియున్నదనీ, ఇంతవరకూ ఆ కార్యక్రమ ఫలితములు తృప్తికరముగ లేవని ఆహారమంత్రి అంగీకరించెను. కాని ఏ పద్ధతిని అవలంబించవలసినదీ స్థూలముగనైనను సూచించలేదు.

గత రెండుసంవత్సరములందూ, ప్రభుత్వము రు 14 కోట్లు సబ్సిడీలకువ్యయపరచినదని, ఎల్లకాలము ఖర్చుపెట్టలేదని చెప్పిరి. ప్రజల ఆహారావసరములకు సంబంధించినపుడు ఈ మొత్తము ఏమాత్రము ఎక్కువకాదు. యుద్ధానంతర నిర్మాణ కార్యక్రమములో ఆహార ఉత్పత్తి ప్రధానస్థానము ఆక్రమింపవలెననినపుడు, వ్యయమునకు వెనుదీసిన అది సాధ్యపడదు. దానికి అవసరమైన ధనము లేకపోయిన, మిగిలిన కార్యక్రమములన్నిటినీ నిలిపి అందుకు వెచ్చించుట అవసరము. ఈ సందర్భమున తాము అవలంబించిన కార్యక్రమ మేమిటో ఆహారమంత్రి వివరింపలేదు. ప్రకృతి అసాధారణ సంపద ప్రసాదించినప్పటికి ఆహారమునకు ఇతరులమీద ఆధారపడవలసిన పరిస్థితికి ప్రభుత్వము తగుచర్య తీసికొనక పోవుటే కారణము. ప్రజా ప్రభుత్వమైననూ దానికి తక్షణము పూనుకొనుట అవసరము. ఆహార ధాన్య విషయమున ఈ రాష్ట్రము లోటురాష్ట్రమని నేను క్రొత్తగ తెలిసిన అంశముకాదు. అది పూర్వమే తెలియును. గత ఆరు సంవత్సరములుగా పూర్తిగా అనుభవమునకు వచ్చినది. ఇపుడైననూ దానిని దిద్దుటకు ప్రభుత్వము తక్షణము ఉపక్రమించుట ధర్మము.

## సర్ జఫ్రుల్లాఖాన్‌కు భారతప్రభుత్వ జవాబు

(1-వ పేజీ తరువాయి)

ఖచ్చితముగ చెప్పుట సాధ్యముకాదు. కాని ఆ ప్రాంతంనుండీ భారతదేశానికి వలసవచ్చివేస్తున్న ముస్లిమేతరుల సంఖ్యనుబట్టి ఈ హత్యలు తీవ్రవధచాలా భారీఎత్తున జరిగి ఉండవలెను. భరింపరాని బాధలకు చెప్పవలవిగాని దౌర్జన్యచర్యలకు గురికావలసివస్తే సేతప్ప ప్రజలు లక్షలాదిగ తమ ఇండ్లవాకిళ్లు వదలిరావడానికి పూనుకోరు.

"దీనికి బాధ్యత పూర్తిగా భారత ప్రభుత్వానిదే. ఇంతవరకూ ఈ విషయాన్ని పరిష్కరించుటలో గాని, ఈ సమస్యను ఎదుర్కొనడంలోగాని భారత ప్రభుత్వం తన బాధ్యతను నిర్వర్తింపలేక పోయినది" సర్ జఫ్రుల్లా గారన్నారు.

ఈ రెండు ఆరోపణలకూ ఎలాంటి ఆధారమున్నూ లేదు. భారత ప్రభుత్వం ఒక వర్గంపై దౌర్జన్యం జరుపవలెనిందిగా మరొక వర్గాన్ని ఎన్నడూ ప్రోత్సహించలేదు. అట్టి దౌర్జన్యచర్యలను ఎన్నడూ సహింపలేదు. తూర్పు పంజాబులోని సంఘటనలు ఇటీవల ఢిల్లీలోని సంఘటనలు పశ్చిమ పంజాబు దురంతాల ఫలితమే కాని ఆ పశ్చిమ పంజాబు సంఘటనలను గురించి సర్ జఫ్రుల్లా గారేమీ చెప్పదలచలేదు.

ఎవరు అభియోగాలు చేయాలనీ ఒకరిపై నిందలు ఆరోపించాలనే ఉద్దేశం భారత ప్రభుత్వానికెప్పుడూ లేదు. కాని నిరాధారమైన ఆరోపణల ప్రచారము జరుగుచున్నపుడు ఉన్న సత్యాన్ని బయటపెట్టవలసివస్తుంది. అది తప్పదు. తూర్పు పంజాబ్, ఢిల్లీలోని సంక్షోభానికి మూలం, అంతఃపూర్వం పశ్చిమ పంజాబులో జరిగిన ఘోర కిరాతకచర్యలే. వాటి విషవర్తుల ఫలితాలను అనుభవించినవారు ముస్లిమేతరులే. కాలాన్నిబట్టి అయితే అవి చాలా రోజుల క్రితం సంగతే గాని ఫలితాలను బట్టి అయితే పశ్చిమపంజాబ్ దురంతాలంత ప్రాధాన్యం తరువనది. కొన్ని సంవత్సరాలుగా పాకిస్తాన్ వాదులు ప్రచారం చేస్తున్న రెండు జాతుల సిద్ధాంతం, ద్వేషం చేస్తున్న పరస్పర ద్వేషం ఇప్పటికీన్ని పాకిస్తాన్‌లో ఉన్నట్టి అధికార ముస్లిం పత్రికలు దౌర్జన్యచర్యల ప్రోత్సహించేయత విద్వేషాన్ని వృద్ధిపరచే రచనలు ప్రకటిస్తున్నది. ఈ పత్రిక లిట్టి రచనలతో నిండి ఉంటున్నది.

భారత కేంద్రప్రభుత్వం ఇప్పటివరకూ అట్టి చర్యా తీసుకోలేదనడం, అసలు సమస్యను ఎదుర్కొనడానికే ప్రయత్నం చేయలేదనడం వాస్తవవిషయాలకు విరుద్ధంగా ఉంటున్నది. అరాచకాన్ని అంతమొందించడానికి, శరణాగతుల రక్షించడానికీ, పాకిస్తాన్‌కు పోదలచిన కాందిశీకులకు తగిన సైనిక రక్షణ ఏర్పాటుచేయడానికి సాధ్యమైన చర్యలన్నింటినీ భారత ప్రభుత్వం తీసుకున్నది. ఈ విషయాన్ని విచారించేందుకు మంత్రివర్గ ఆసాధారణ, అత్యవసర సంఘం ప్రతిరోజూ సమావేశమౌతూ ఉంటున్నది. పాకిస్తాన్ ప్రాంతంనుండి వస్తున్న కాందిశీకులు ఇప్పటికి 10 లక్షలకు పైగా ఉన్నారు. వీరికి రక్షణ సౌకర్యాలు కల్పించడం ఎంత ప్రధాన సమస్యగా పరిగణించి విచారించుతూ ఉందో పాకిస్తాన్‌కుపోయే కాందిశీకులకు రవాణా రక్షణ ఏర్పాట్లుచేయడం కూడా అంత ప్రధానమైన సమస్యగానే ఎంచి పరిష్కరింపబడుతూ ఉంది. ఢిల్లీ పరిస్థితులను చక్కబెట్టేందుకు ప్రభుత్వం ఒక అధినేత మంత్రి అధ్యక్షత నొక ప్రత్యేక ఉపసంఘాన్ని కూడా నియమించింది. తూర్పు పంజాబులోనూ, ఢిల్లీలోనూ కూడా పరిస్థితులు బాగా అదుపులో ఉన్నవి.

ఈ సంఘటనలు తలవనితలంపుగా, సామాన్యంగా జరిగినప్పటికీ భారత ప్రభుత్వం చాలావరకు కృతకృత్యమైనది. ఇదే సంగతి పాకిస్తాన్ ప్రభుత్వం గురించి చెప్పలేము. పశ్చిమ పంజాబునుండి వస్తున్న ముస్లిమేతర కాందిశీకులపై అనునిత్యం దాడ్లు జరుగుతూ ఉన్నట్లు భారత ప్రభుత్వానికి వర్తమానం వస్తూనే ఉంది. ముస్లిమేతర కాందిశీక దళంపై 14 వ తేదీన దాడి జరిపినట్లూ, 18 వ తేదీన కాందిశీకుల రైలుపై ముస్లిం కాందిశీకుల తీసుకుపోతున్న రైలు రక్షకులుగా ఉన్న పాకిస్తాన్ సైనికులు కాల్పులు చేసినట్లు పశ్చిమ పంజాబు పరిసరాలు ఇరవైలగా పాకిస్తాన్, సేనలు దోపిడి వస్తైరా జరుపుతున్నట్లు నిన్నే ఒక సైనికాధికారి వెల్లడించెను. ఇదే అధికారి తూర్పు పంజాబు సంఘటనల గురించి ఈవిధముగా చెప్పినాడు: ఒక జిల్లానుండి అటువంటి సంఘటనలూ జరుగలేదని వర్తమానం వచ్చింది. ఒక ప్రాంతంనుంచి మరోప్రాంతానికి 20,000 కాందిశీకులు సైనికుల రక్షణలో పంపబడిరి. చిల్లర దాడులు రెండు పర్యాయములు జరిగినట్లు అప్పుడు దాడిచేసినవారిపై భారత సైనికులు కాల్పులుచేసినట్లునూ తెలుస్తున్నది. మరో రెండు జిల్లాలనుండి ముస్లింలరవాణా క్రమంగా జరుగుతూ ఉంది. ఇందువల్ల భారత ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలు ఏవిధంగా ఉంటున్నదీ పాకిస్తాన్ ప్రభుత్వం అక్కడున్న అల్పసంఖ్యాకవర్గాల రక్షణకు ఎట్టిచర్య తీసుకొంటున్నదీ వీటిఫలితాలు ఏవిధంగా ఉంటున్నదీ స్పష్టంకాగలదు.

ఈ ముస్లిం చిత్రవధను అపకపోయినపక్షంలో తామీ విషయమై ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు చేయుదుమని సర్ జఫ్రుల్లాగారన్నారు. ఇది జఫ్రుల్లా గారికీ వారి ప్రభుత్వానికే సంబంధించింది. సర్ జఫ్రుల్లా గారి ఆరోపణలపై విచారణచేసి తీర్పు చెప్పడానికి ఒక నిష్పక్షపాత ట్రిబ్యునల్ కు వసతిచేయడానికి భారత ప్రభుత్వం సిద్ధంగా ఉంది."

## నిజాం ఖజానాకు అరబ్ సైనికుల కాపలా

### సంస్థానంలో కాంగ్రెస్ ఉద్యమం తీవ్రత

("ఆంధ్రపత్రిక" విలేఖరి)

హైదరాబాద్, సెప్టెంబర్ 19: సంస్థాన కాంగ్రెస్ ఉద్యమం ఉద్వేగంతో జరుగుతున్నందున నిజాం ప్రభుత్వం హైదరాబాద్, సికందరాబాద్ నగరాలలో ఈ 17 వ తేదీతో ముగియవలసిన 145 వ సెక్షన్ ఉత్తరువు అక్టోబర్ 7 వ తేదీవరకూ పొడిగించింది. మెదక్ జిల్లా సదాశివపేటలో ఈ నెల 14 నుంచి 29 వరకూ సంగారెడ్డిలో 14 నుంచి 21 వరకూ ఈ ఉత్తరువు అమలు చేయడమయింది.

సంస్థానం అంతటా కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమం తీవ్రంకావడాన్ని, ఓరుగల్లు కరీంనగర్ జిల్లాలలో ఇటీవల జరిగిన అల్లరులనూ పురస్కరించుకొని ప్రభుత్వ ఖజానాలనూ హైదరాబాద్ కమర్షియల్ కార్పొరేషన్, గోదాములనూ కాపలా కాయడానికి ఇర్రెగ్యులర్ అరబ్బు పటాలాలను పంపించారు. ముందు జాగ్రత్తకే ఇలా పంపడం జరిగిందని తెలుస్తున్నది.

### సిద్ధిపేటలో సైనికుల కాల్పులు

ఇక్కడికి ఉత్తర దిశగా 50 మైళ్లలో ఉన్న సిద్ధిపేట గ్రామస్థులపై సైనికులు కాల్పులు జరిపినందువల్ల ఒకరు మరణించటం, 2 తీవ్రంగా గాయపడడం జరిగినట్లు అనధికారవార్త వచ్చింది. ఇంతవరకూ సుమారు 400 మందిని అరెస్టు చేసినట్లు తెలిసింది.

### నాందేడులో అశాంతిభయం

ఉత్తర హిందూస్థానంనుంచివలసవచ్చే సిక్కు కాందిశీకుల మూలంగా నాందేడులో అశాంతి కలిగేసూచన ఉన్నదని నాందేడ్ జిల్లా పోలీసు సూపరింటెండెంటు, సిక్కు గురుద్వారం సూపరింటెండెంటు గార్లు కబురుచేసినందున పోలీసుశాఖ డైరెక్టర్ జనరల్ నవాబ్ దీన్ యార్ జంగ్ బహదూర్ శాంతిభద్రతల పరరక్షణకు తగు చర్యలు తీసుకొనే నిమిత్తం నాందేడ్ వెళ్లారు.

### 'నిఖా' పై నిషా

ఖమ్మం తాలూకాలోని కొంబుర్ల గ్రామంలోని ఒకషావుకారు, వివాహమునకై ఇండియన్ యూనియన్‌లోని ప్రాంతంలో నున్న బంధువులతో సంబంధం నిశ్చయించుకున్నాడు. పీరా పెండ్లిసమయానికి, స్థానిక పోలీసు దఫేదారువచ్చి, ఇండియన్ యూనియన్ ప్రాంతానికి చెందిన వధువుతో సంబంధం పెట్టుకుంటే, నిజాం ప్రభుత్వము పూరుకోదని బెదిరించి పెండ్లి యెత్తగొట్టినాడు.

ఇంతవరకూ ఉత్తరహిందూస్థానం నుంచి 600 మంది కాందిశీకులు హైదరాబాద్ వచ్చారు. వారిలో చాలామంది ముస్లిములే. వారికి సహాయం ఇత్తెహాదుల్ ముస్లిమీన్, చాలా ఏట్లుచేస్తున్నది.

### అరెస్టయిన మొత్తం సత్యాగ్రహుల్ని

సంస్థానంలో సత్యాగ్రహం చేసినందుకు ఇంతవరకూ మొత్తం 107 మంది అరెస్టుఅయినట్లు సంస్థాన కాంగ్రెస్ కార్యాలయప్రకటనవల్ల తెలుస్తున్నది.

### కమ్మంమెట్టు కాంగ్రెస్ కార్యదర్శి అరెస్టు

కమ్మంమెట్టు, సెప్టెంబరు 17: ఈ పట్టణ కాంగ్రెస్ సహాయ కార్యదర్శి కర్ణాటి అప్పారావుగారినీ వారితమ్ముడు స్వామిగారినీ రాత్రి సుం 10 లకు పోలీసులు అరెస్టుచేసినారు. పోలీసులు వీరిని తీవ్రంగా హింసించినట్లు తెలుస్తున్నది.

## మైసూరు సత్యాగ్రహోద్యమం

[1 వ పేజీ తరువాయి]

విపరీతంగా ఉండడంవల్ల అప్పటికీ విజయంపొందలేక చుట్టుపక్కల గ్రామాల్లో తిరుగుటకోసం వెడలిపోయారని తెలుస్తున్నది.

బెంగుళూర్ కబ్బన్ పార్కులో ఉన్న శ్రీ చామరాజేంద్ర ఒడయర్ (ఇప్పటి ప్రభువుతాత) చలువరాతి విగ్రహాన్ని ఇవ్వాళ కొద్దిగా ధ్వంసంచేశారు. కుడికాలు విరిగిపోయింది. ఈ విషయంలో ఆచోకీకి ప్రయత్నిస్తున్న పోలీసులు ఇది సత్యాగ్రహోద్యమానికే సంబంధించినట్లు భావిస్తున్నారు.

### జైలునుంచి కాంగ్రెస్ నాయకులపరారీ

బెంగుళూరు, సెప్టెంబరు 18: బెంగుళూరు జైలులనుండి హాసన్ జయిలుకు బదలీ చెయ్యబడిన నలుగురు ప్రముఖ కాంగ్రెసు నాయకులు ఇవ్వాళ తప్పించుకుని పారిపోయినట్లు తెలుస్తున్నది. వీరనలుగురూ సంస్థాన కాంగ్రెసు కార్యవర్గ సభ్యులేనట!

బెంగుళూరు, సెంట్రల్ జైలుగోడను ప్రేలుడుమందుతో కూలద్రోయ్యాలని ఇవాళ ఒక ప్రయత్నం జరిగింది కొన్ని రాళ్లు ఊడిపోయాయిగాని గోడమాత్రం పడిపోలేదు.

కర్ణాట రాష్ట్రీయమ్యూనిస్టు సంఘ కార్యదర్శి ఎస్. ఎల్. ఉపాధ్యాయగారు ఇవ్వాళ అరెస్టు అయ్యారు.

హిందూమహాసభ తాత్కాలికాధ్యక్షుడు. జి. వి. రామాచారి, బెంగుళూరు పురపాలకసంఘ పూర్వాధ్యక్షుడు హనుమంతప్ప, ప్రతినిధి సంఘసభ్యురాలు శ్రీమతి అన్నపూర్ణమ్మగార్లను సంస్థాన పోలీసులు ఇవ్వాళ అరెస్టుచేశారు.

కోలారునుండి మైసూరులో రాజభవన సత్యాగ్రహంలో పాల్గొనడానికి వచ్చిన 40 మంది ప్రజానాయకులను కంటోన్మెంటు పోలీసులు అరెస్టుచేశారు.

## మార్షల్ సూచన

ఒక సర్వసభ్య సంఘమును ఏర్పాటు చేయవలెనని మార్షల్ చేసిన సూచనను 18 సమావేశంలో చాలామంది ప్రతినిధులు బలపరిచిరి.

ఆస్ట్రేలియా విదేశాంగశాఖమంత్రి డా, హ్యూయివట్ ఇవాట్ మాట్లాడుతూ సర్వసభ్యసంఘము నేర్పరచుటకు తాను సంపూర్తిగా అంగీకరిస్తున్నట్లు చెప్పారు. వీటో అధికారం రద్దుకావలెనని ఆస్ట్రేలియా మొదటినుండీ పట్టుదలతో పనిచేస్తూ వున్నది. భద్రతా మండలి నిరుపయోగమును, వీటో అన్యాయమును గ్రీస్ సమస్య నిరూపించినదని ఈయన అన్నాడు.

చైనా విదేశాంగశాఖ మంత్రి డా॥ వాంగ్ షిహ్ మాట్లాడుతూ "బాహ్యహంకారము, జాతి విభేదము నశించనంత కాలం అంతర్జాతీయత దుర్బలంగానే వుండగలదు. జాతీయతను విడనాడి, ప్రతిసభ్య రాజ్యమును అంతర్జాతీయతను స్వీకరించిన తప్ప శాంతికి తావులేదు" అన్నాడు.

ఫిలిప్పైన్స్ ప్రతినిధి కార్లోరోములో మాట్లాడుతూ వీటో దుష్ప్రయోగం వలన ఐక్యరాజ్య సమితియే నాశనమైపోతున్నది. ఐక్యరాజ్య సమితి కావాలో వీటో కావాలో తేల్చుకోవాలి; ఈ రెండింటికీ పొసగదు; త్వరలోనే రెండూ కూడా నశించిపోవచ్చును. అని చెపుతూ మార్షల్ సూచనను బలపరచెను. భారతీయుల సమస్యపై దక్షిణాఫ్రికా ఐక్యరాజ్యసమితిని నిర్లక్ష్యంచేయటం, వీటో దుష్ప్రయోగం కన్న ఖండింపబడవలెనని ఈయన చెప్పాడు.

### రష్యన్ ప్రతినిధి ఖండన

మార్షల్ సూచనలు తమకు అంగీకారయోగ్యంగా లేవని రష్యా విదేశాంగ శాఖ సహాయ కార్యదర్శి ఆండ్రీ విషిన్‌స్కీ తన ఉపన్యాసంలో తెలియజేశాడు. అమెరికా ప్రబలం ఐక్యరాజ్యసమితి ప్రణాళికను విరుద్ధంగానూ, ఐక్యరాజ్యసమితి, తీర్మానములకు విరుద్ధంగానూ ప్రవర్తిస్తున్నదని ఈయన ఆరోపణచేశాడు. ఐక్యరాజ్యసమితిని తను స్వకుచిత స్వప్రయోజనములకు ఈ దేశాలు ఉపయోగించుకోవటం వలన ఆ సమితి దుర్బలమై పోతున్నదని ఈయన అన్నాడు. అణ్వస్త్ర సన్యాస విషయంలో ఈ రెండు దేశాలు క్షణక్షణము అడ్డుపడుతున్నవనీ, వాటికి అణ్వస్త్ర సన్యాసం యిష్టంలేదనీ విషిన్‌స్కీ అన్నాడు. ఆటంబాంబును బహిష్కరించవలెనని రష్యాచేసిన సూచనలు అమెరికా నిరోధిస్తున్నదని కూడా ఈయన ఆరోపించాడు.

### మార్షల్‌టాప్ అమెరికా వస్తాడా?

రష్యాను గురించి అమెరికా చేస్తున్న దుష్ప్రచారము నరికట్టుటకు మార్షల్ టాప్ స్వయంగా అమెరికా రానున్నాడని ఇక్కడ భావిస్తున్నారు. ఈ సంగతి తనకేమీ తెలియదని విషిన్‌స్కీ అన్నాడు.

## కౌన్సిలులో ఆహారస్థితిపై చర్చ

### బొల్లిని నారాయణస్వామి గారి సవరణ

చెన్నపురి, సెప్టెంబర్ 19: ధాన్యపు ధర మణుగు ఒకటికి రూ 6/- నుండి రూ 8/- వరకు పెంచవలెననియు; వ్యవసాయాభివృద్ధికై తక్షణం ఎలెక్ట్రిసిటీ సప్లయ్ చేయవలెననియు; తరుచుగా పొంగిపంటలను నాశనముచేయు నదులకు తాత్కాలికముగ ఆట్టి వరదలరాకుండా వసతులు చేయవలెననియు; ఎరువుల ఉత్పత్తిని ఎక్కువచేసి వాటికై ఫ్యాక్టరీలను నిర్మించవలెను అని నేడు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో శ్రీ బొల్లిని నారాయణస్వామిగారు ఒక సవరణను ప్రతిపాదించిరి. తీర్మానముపై ప్రసంగించుచూ శ్రీ నారాయణస్వామిగారు తాను 10 దినముల క్రిందట ఆహారమంత్రి డా॥ రాజన్‌గారిని, జిల్లాలలోనూ, మ్యునిసిపాలిటీలలోను సప్లయ్ చేయబడుచున్న ధాన్యములలెక్క ఆడుగగా ఇంతవరకు మంత్రిగారు ఇవ్వలేదనిరి.

డా॥ రాజన్ :- నేను ఇచ్చితిని.

శ్రీ నారాయణస్వామి :—ఇవ్వలేదు. ఇప్పటికైనా ఇచ్చిన సంతోషించెదను, ఒక గౌరవసభ్యుడు కోరిన లెక్కను ఇంతవరకు మంత్రిగారు సప్లయ్ చేయకపోవుట తుంతవ్యము కాదు. 1945-46 సంవత్సరములో మన ఆహారధాన్యముల మొత్తము 20.75 లక్షల టన్నులు. ఇందులో 6 లక్షల టన్నులు కేంద్ర ప్రభుత్వ మిచ్చినది. ఆరు లక్షల పై చిల్లర, విశాఖ, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలు ఇచ్చినవి. 1947 లో, 8 జోన్సుల రేషన్ ప్రకారము 18.26 లక్షల టన్నుల ఆహార ధాన్యము చాలును. కేంద్రమునుంచి 2,26 లక్షల టన్నులుమాత్రమే వచ్చినది. కాని ఇంకా 2.81 లక్షల టన్నులబియ్యము, 28 వేల టన్నుల జొన్నలు కావలెనని ఆహార మంత్రి చెప్పుచున్నాడు. 1945-46 సంవత్సరములో దాదాపు సగము ఆహారభారమును వహించినది ఉత్తరజిల్లాలే. రేషన్ పెంచికూడా ఆహారసమస్యను పరిష్కరించలేక ఆహారమంత్రి అన్యాయముగా ఉత్తర జిల్లాలను నిందించుచున్నాడు. ఉత్తరజిల్లాలలో మాత్రమే మోసము జరుగుచున్నదనుచున్నదని, వాణిజ్యపుపంటలు ఎక్కువగా పండించుచున్నవని డా॥ రాజన్ తను నివేదికలో చెప్పినారు. పయినా డా॥ రాజన్‌గారు ఒక్క సర్కార్లు మాత్రమే అధిక ధాన్యముగల జిల్లాలనుచున్నారు. తంజావూరు, దక్షిణ ఆర్కాట్, తిరుచునాపల్లి జిల్లాలమాట ఏమి? ఆహారమంత్రి కీపక్షపాతమెందుకు? ఆంధ్రజిల్లాలలో ఆహారము దొరుకక జనము విపరీతముగా బాధపడుచున్నారు. వేటపాలెం, గుంటూరు, మాచవరం, చీరాల, సింగరాయకొండ, ఒంగోలు— ఇంకనూ అనేక స్థలములు వెళ్లి చూచిన తెలియును. కొన్ని పత్రికలలో ఈవార్తలు ప్రచురింపబడుచున్నవి. బ్లాక్‌మార్కెట్ పెరిగిపోవుచున్నది. మామూలు ప్రజలు బాధపడుచున్నారు. వారిని పోలీసులు బాధించుచున్నారు. ఈ ప్రజలా మోసకారులు? ఈ ఆహార మంత్రికి తోడు ఒక పత్రిక (హిందు) అనవసరముగా సర్కారు జిల్లాలను నిందించుట జరుగుచున్నది. డా॥ రాజన్‌గారి స్టేట్‌మెంట్‌లో, ఆహార సమస్యను పరిష్కరించుటకై ఏమైనా కార్యక్రమము సూచింపబడినదా? లేదు. ఏల లేదు? పైగా సర్కార్లను నిందించుటకు పూనినాడు. మనమంతా ఇంకా కలసిమెలసి—200 ఏండ్లనుంచి ఒక రాష్ట్రంగా కలసి ఉంటున్నామని కృతజ్ఞత చూపక, సర్కార్లను డా॥ రాజన్‌గారు నిందించవచ్చునా? ఇట్టి నిందలను మిగతా మంత్రులెట్లు సహించినారు? ఆహారసమస్య రాజకీయములకు అతీతమైనది. కాని ధాన్యసేకరణ రాజకీయముల కతీతముగా జరుగుచున్నదా? వ్యవసాయమంత్రిగారు నెల్లూరుకు, గూడూరు గనులకు విద్యుచ్ఛక్తిని సప్లయ్ చేసెదమనుచున్నాడు. విద్యుచ్ఛక్తి కావలసినది వ్యవసాయములకుగాని, నెల్లూరు, గూడూరు పట్టణములకు కాదు. వ్యవసాయమంత్రిగారు రైతును సంస్కరించెద ననుచున్నారు. కాంగ్రెసు మంత్రులైన మీరు జైలుజీవితములో పట్టాలు లభించినవికదా! ఇక ఈ దబ్బుమక్కు రాజకీయములవదలి రైతుల కష్టముల విచారించవలెను, 1939 సంవత్సరం తరువాత వస్త్ర ధర 1½ రెట్లు పెరిగినది. కాని సుద్దధర 6 రెట్లు చిల్లర ఆహార ద్రవ్యముల ధర 4 రెట్లు, మిగతా వస్తువులధర 4 రెట్లు పెరిగినవి.

ఎందుకీ పక్షపాతము? ధర పెంచక వాణిజ్య పంటలు వేస్తున్నారని, మోసగులని నిందించి లాభమేమి? పల్లె వ్యవసాయము మెట్లు జరుగుచున్నదో చూచిన, మంత్రులకు అసలువిషయము తెలియగలదు. రేడియోపై ప్రసంగములు ఆహారసేకరణ చేయజాలవు. ఊరులజంట తిరిగినంత మాత్రమున కూడా సేకరణ జరుగదు. వ్యవసాయకుని జీవితమును బాగుపరచవలెను. అని శ్రీ నారాయణస్వామిగారనిరి.

డా. వి. కె. జాన్‌గారు డాక్టర్ రాజన్‌గారు చేసిన సాకల్యమైన ప్రకటనకు అభినందించిరి. మంత్రివర్గము ప్రధాని, అందరూ కలసికట్టుగా పనిచేసి క్షామమునుంచి రక్షించినందుకు కృతజ్ఞత తెలిపిరి, ఈ క్షామపరిస్థితిని ఆధారముచేసుకొని రాజకీయకారణములకు కొందరు ఉపయోగించ చూచుచున్నారు. — నింద విఫలమైనచో మంత్రివర్గము పోవునని తాముచచ్చి అక్రమించవచ్చునని యోచించుచున్నారు. ఒది అక్రమము. ఉత్పత్తివినియోగదార్ల సహకారసంఘములు విఫలమైనందున మంత్రిగారు వాటి సంబంధమున తీసుకున్న చర్య బాగున్నది. ధాన్యము నిల్వచో బలప్రయోగము చెయ్యవని ప్రధానిచేసిన ప్రకటనతో ఏకీభవించుచున్నామనిరి.

"తంజావూరు ధాన్యదానములో మెప్పబడినది. సర్కార్లు కూడా ఆ మార్గము ననుసరించు గాక! దీర్ఘకాల ప్రణాళిక వేయుటకు ఈ మంత్రివర్గమునకు వ్యవధిలేదని అంగీకరింపవచ్చును. కాని ఆ ప్రణాళిక లేనిదే ఏమియూ జరగదు. ప్రతి జిల్లాలో సాగు చెయ్యవలసిన భూమిని సాగు చేయించుటకు ఒక అధికారిని వేసి తక్షణమే సాగు చేయించుటకు పూనుకొనవలెను. కావలసినచో ప్రభుత్వము ఆ భూమిని స్వాధీనపరచుకొని సాగు ప్రారంభింపవలెను. ఇట్టి శ్రద్ధ తీసుకొన్న 14 కోట్లు వేరు వినసుగా వినియోగించవలసిన అవసరము లేదు. పంచవర్ష ప్రణాళికను తయారుచేసి, నీటి పారుదలను బాగుచేసి, పసవృద్ధికి తోడ్పడవలెననిరి.

ఇప్పుడు ప్రభుత్వము ధాన్యసేకరించుటంలోనే తమ శక్తియుక్తులను నిమగ్నము చేసి ఉన్నారు. దానికితోడు ఒక ప్రణాళికను వేసి, దానిప్రకారము వెంటనే కృషిచేయవలెననిరి. యుద్ధంధి వసూళ్లలో చూపిన పోటీని, ఉత్సాహమును భూమి సాగులో చూపించవలెననిరి.

డా॥ రాజన్‌గారు తక్షణమునకొకసారి ధాన్యసేకరణ అంకెలు ప్రకటించుచున్నామనిరి. మలబారులోని విపరీతపరిస్థితులవల్ల, ఈ సాలున ప్రాజెక్టుల నిర్మాణము ఏమియూ తీసుకొనలేదనిరి.

అధ్యక్షులు సమ్మతిపై డా॥ రాజన్‌గారు నారాయణస్వామి నాయుడుగారికి చర్చకు చివర సమాధానము నిచ్చెదమనిరి.

ఇబ్రహీం సాహెబ్‌గారు క్రిందటి బడ్జెటు చర్చవేళ తాము చేసిన సూచనలు చాలా భాగము గాలికి వదిలినవా. ఈ ప్రభుత్వము ఉత్పత్తి వినియోగదార్ల సహకార సంఘముల సందర్భమున సత్యమును గమనించినందుకు అభినందించుచున్నామనిరి. విపరీత సమయమున పరిశీలన చేయుట మంచిదికాదు. సర్కార్లలోవలె ఇతర చోట్లకూడా అనుభవము అయినగాని వీటిని రద్దుచేయమనట్లే మేలుగాదు. చిరకాలము ప్రభుత్వము ఇంతమంది మహాజనమును పోషించుటకు అనంతముగా బాధ్యత వహించలేదని ఆహారమంత్రిగారు చెప్పియుండిరి. కాని ఒక్కరోజున వచ్చి మంత్రిగారు మా బాధ్యత తీరిపోయినదని ఎటులచెప్పగలరు? ధాన్యము ధర మన రాష్ట్రములో 'చాలా తక్కువ' అని మంత్రిగారు ఒప్పుకొనిరి. అట్టి సమయమున భారతప్రభుత్వము మనకుగూడా ఇతర రాష్ట్రములవలె లాభము పెంచుకు పొందనివ్వరాదు. తక్కువ ధరకు రైతు ధాన్యమును ఇచ్చివేసిన జీవితావసరములను అతడు ఎట్లు కట్టుకొనగలడు? ప్రధానీ ఆహారమంత్రియు ఆహారధాన్యము ధర హెచ్చింపజేయుటకు పలేనుతేసుగుచున్నారని తమకు తెలియుననిరి. ఇంతవరకైన రాష్ట్రమునకు స్వాతంత్ర్యము ఉండితీరవలెననియు, ధాన్యము ధరనైన నిర్ణయించుటకు రాష్ట్రమునకు అధికారము లేనిచో రాష్ట్రస్వాతంత్ర్యమెందుకని ఇబ్రహీంగారు అడిగిరి.

జనాభా హెచ్చుచున్నదని మంత్రిగారు తెలిపియుండిరని ఇబ్రహీంగారు అనగా "జన్మనిగ్రహమును మీరు ఉద్బోధించెదరా" అని అధ్యక్షులు అడిగిరి. జన్మనిగ్రహమునకు తామెన్నడూ అంగీకరింపమనియు, సృష్టి ఆగరాదనియు పథ్యులు నవ్వ ఇబ్రహీంగారు సమాధాన మిచ్చిరి. రాష్ట్రవాసుల పెద్దక్కను సర్వసమస్యల పరిశీలించి, తగిన ఉత్పత్తిచేయుటకు దీర్ఘకాల ప్రణాళికలు తయారుచెయ్యవలెను గాని 'మీరా' 'మీరా' అని బయలుదేరి మాటలు ఆడగరాదని ఇబ్రహీంగారు చెప్పిరి.

ఎం. డి. టి. కుమారస్వామి మొదలియారుగారు రైతుల వ్యవసాయకూలీలకు జీవనభృతికి తగినంతవదలి ధాన్యసేకరణ చెయ్యవలెననిరి. ధాన్యనిల్వల సందర్భమున గ్రామసంఘములు తిన్నగా వ్యవహరింపలేదు. గ్రామసంఘములుపత్రులలోనూ మంత్రములలోనూ మునిగితేలుచూ, సంఘమునకు అపకారము చేయుచున్నందున వాటిని రద్దుచెయ్యవలెననిరి.

సభవారు ఫలహారములకు లేచిరి.

# రాయలసీమకు వ్యవసాయ పరికరాలు

## ప్రశ్నలకాలంలో వ్యవసాయ మంత్రి సమాధానం

### స్పీకరు ప్రెసిడెంట్ల బత్తాల రద్దుగూర్చి ప్రశ్నలు

చెన్నపట్నం, సెప్టెంబర్ 17: ఈ ఏడాది రాయలసీమజిల్లాలకు, ముఖ్యంగా అనంతపురం జిల్లాకు వ్యవసాయ పరికరములు సరఫరా చెయ్యలేదేమని రాయప్పగారు అడుగగా జిల్లావారీ సరఫరాలు సభ్యులకు వ్రాతపూర్వకముగా తెలుపబడెనని వ్యవసాయమంత్రి కె. మాధవమీనన్‌గారు తెలిపిరి. ఇనుము, ఉక్కు సరిగా లభింపనందున ఉన్న పరికరములను అన్ని జిల్లాలకు పంచవలసి ఉన్నదనియు అందువల్ల కోరినవారందరికీ సప్లయి చేయుట కష్టమనియు, అవసరములకు, సప్లయికి చాలా అగాధముండుట తప్పదనిరి.

శ్రీ రాయప్ప: ఆహారసంఘ సమావేశంలో జిల్లా వ్యవసాయాధికారి పరికరాలేవీ రాలేదని చెప్పిన సంగతి మంత్రిగారికి తెలియునా?

స: నేను వ్రాసిన ప్రకటనవల్ల అది కొల్లదు.

శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య: నెల్లూరు రైతును మద్రాసునుంచి, బెజవాడ మనిషిని తూత్తుకుడినుంచి సప్లయిలు తెప్పించుకోమనటం న్యాయమా?

స: భారతప్రభుత్వంవారి సరఫరాల నుంచి సప్లయి ఉన్నోగి సరకులున్న చోటకు నల్ని కావలసినవాటిని తెప్పించుకోవలసిఉండును. గౌరవసభ్యుడు చెప్పినది సరియైనదో కాదో నేను హామీ ఇవ్వలేను.

శ్రీ రాఘవయ్య:—మంత్రిగా కట్టనట మర్యాదయా?

స్పీకరు:—మీ ఆభ్యంతర మేమి?

ఇస్మాయిల్‌గారు:—అందులో సభా మర్యాదకు భంగమైన దేమీ లేదు.

స్పీకరుగారు:—అందులో అభ్యంతరము లేదు.

శ్రీ ఎస్. నాగప్ప:—ఒక జిల్లాకు మరో జిల్లాకు ఎంత వ్యత్యాస మేల ఉండవలెను?

స:—వ్యవసాయము చేయు భూమిపై సప్లయిలు ఆధారపడి ఉండును?

ప్ర:—రాయలసీమ ప్రాంతము తక్కువగా నున్నదా?

స:—ప్రాంత వైశాల్యమే గాక ఇతర విషయములు గూడా ఉండును.

శ్రీ బి. ఎస్. మూర్తి:—ఇప్పుడు సప్లయిలలోని అక్రమములు తొలగింతురా?

స:—నేను అక్రమములు ఉన్నవని ఒప్పుకొనలేదు.

ఉద్యోగమును విరమించి విశ్రాంతి పుచ్చుకోరాదా అని పలాంగారు అడుగగా మంత్రిగారు అది తను ఇష్టాయిష్టములకు సంబంధించినదనిరి.

### మలబారు స్పెషల్ పోలీసు

నంబియారుగారి ప్రశ్నకు సమాధానంగా మలబారు స్పెషల్ పోలీసును రద్దు చేయుటలేదని, చేయబోమని హోంశాఖామంత్రి డా॥ పి. సుబ్బరాయన్ గారు చెప్పిరి.

### నెల్లూరు జిల్లా రేషను ఇబ్బందులు

శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారి ప్రశ్నకు సమాధానముగా ఆహారమంత్రి డా॥ రాజన్‌గారు రాపూరు, ఆత్మకూరు, ఉదయగిరి తాలూకాలలో పంట పోయిన సంగతి తమకు తెలియుననియు, రేషను షాపు లన్నిటిలో బియ్యము లేదనుట సరిగాదనియు, ఒకటి రెండుచోట్ల అట్లు జరిగెననియు, పంపకము చేయు ఏజెన్సీ మార్పువల్ల ఇది సంభవించెననియు చెప్పిరి. తర్వాత కొన్ని లతినువారికిగూడా బియ్యము నిచ్చిరనియు, ఇప్పుడు ఆహారధాన్యములు తగినన్ని పంపబడెననిరి. పొదలకూరు, కలువాయిల రేషనుషాపుల నమోనాలు తమకు రాలేదనిరి. పుచ్చిపోయిన సరుకు ఇవ్వకుండా చేయుటకు తనిఖీ జరిగినదనియు మంచిసరుకునే ఇచ్చుచున్నారనియు మంత్రిగారు చెప్పిరి.

## స్పీకరు ప్రెసిడెంట్ల ప్రయాణపు బత్తాలు

శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి ప్రశ్నకు సమాధానంగా ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు స్పీకరు ప్రెసిడెంటు, డిప్టి ప్రెసిడెంటు డిప్టి స్పీకర్ల బత్తాలు రద్దు చెయ్యబడినవనియు, వారు చెయ్యవలసిన అధికార కృత్యము తెవ్వియు లేకపోవుటయే అందుకు కారణమనియు రద్దు చేయుటముందు వారిని సంప్రదించలేదనియు తెలిపిరి.

శ్రీ నాగప్ప: స్పీకరుగారు ప్రభుత్వ దేవాలయ ప్రవేశచట్టమును అమలు పరచుచున్నందువల్ల బత్తాలిచ్చుట న్యాయముగదా!

స: అందుకు స్పీకరుకు ప్రభుత్వ మెంతయు కృతజ్ఞులు. కాని అది అధికార కృత్యముగాదు.

ప్ర: ప్రభుత్వ చట్టముల నెవరు అమలు పరచెదరు?

స: గౌరవ సభ్యులంతాగూడా సహాయము చెయ్యవలెను.

దొరరాజపాండ్యన్: బత్తాలు ఎప్పుడు వచ్చినవి.

స: 1920 లో వచ్చినవి. 1947 ఫిబ్రవరిలో రిన్యూ చేసినారు.

ఇస్మాయిల్ సాహెబ్: స్పీకరు ప్రెసిడెంటు ప్రభుత్వ యంత్రాంగంలోని వారే గనుక—

స: కాదు.

శ్రీ తెన్నేటి విశ్వనాథం: ఇదివరకు ఇచ్చుచున్న వాటిని రద్దుచేయుటకు కనిపించిన తక్షణ కారణమేమి?

స: 1920 లో వచ్చిన నిబంధనలు 47 లో ఉండాలనటానికి వీలులేదు.

శ్రీ డి. వి. రామస్వామి: డెప్టి స్పీకరు ప్రజలుపిలిచినచోటకు వెళ్లాలంటే ఎట్లా?

స: అది ప్రభుత్వ కార్యముకాదు.

శ్రీ విశ్వనాథం: అంతవరకూ ఇచ్చుచూ అమాంతం వీటిని మార్చవలసిన కారణమేమివచ్చినది?

స: వీటినే మార్పులేదు, మంత్రుల, ప్రభుత్వోద్యోగుల బత్తాలు మార్పు తలోచనతో ఇవీ వచ్చినవి.

అన్వారా: అయ్యా స్పీకరుగారూ—మీరు ప్రభుత్వయంత్రంలోని వారా (నవ్వు)

స: కాదు.

శ్రీ నటేశశెట్టి: ఇతర రాష్ట్రాల్లో ఇస్తున్నారా?

స: నాకు తెలిసినంతవరకూ లేదు.

పి. నటేశన్: మీరు ఇంతవరకూ బత్తా తెతకతీసుకున్నారు.

## జిల్లావారీ వ్యవసాయ పరికరాల సప్లయి

### 1947 జనవరినుంచి మే దాకా

| | నాగలిపరికరాలు | పారలు | నాగళ్లు | గొడ్డలి | గునపాలు |
|---|---|---|---|---|---|
| ఉ॥ విశాఖ | 1251 | 194 | | 34 | |
| ద॥ విశాఖ | 21,60 | | | | 3218 |
| తూ॥ గోదావరి | | | 1 | | 2887 |
| ప॥ గోదావరి | | 608 | | 1 | 679 |
| కృష్ణా | | 936 | | | 270 |
| గుంటూరు | 1094 | | | | |
| నెల్లూరు | | | | | |
| కర్నూలు | | | 2 | | |
| అనంతపురం | 508 | 970 | 66 | 24 | |
| బళ్లారి | 708 | 5242 | 12 | | |
| కడప | 152 | | 5 | | |
| చిత్తూరు | 2423 | 948 | 811 | | |
| మధుర | 5,071 | 2935 | 21 | 168 | 101 |
| తంజావూరు | 224 | 3300 | 269 | | |

### ప్రభుత్వ ఖాదీ విధానము

శ్రీ మనికోట కుమారన్‌గారు పయ్యనూరు ఖాదీ కేంద్రమున తీవ్రతరోద్యమము ఎప్పుడు ప్రారంభింపబడెనను ప్రశ్నపై ఆగస్టు 15 తర్వాత ప్రభుత్వ ఖాదీ విధానము ఏమైన మారెనా అనగా మారలేదనియు అదే విధానమనియు డా॥ సుబ్బరాయన్‌గారు చెప్పిరి.

### కులాలవారీ ఉద్యోగాలు

ఎ. సుబ్రహ్మణ్యంగారు వర్ణి కుల తత్రియులకు ప్రత్యేకముగా ప్రోత్సాహమిచ్చి ఉద్యోగముల నిచ్చెదరా యనిఅడుగగా డాక్టరు సుబ్బరాయన్‌గారు ఈకులాలవారి ఉద్యోగములతో తమకు తలనొప్పి వచ్చుచున్నదనిరి. ఆర్. వి. స్వామినాథన్‌గారి ఉపప్రశ్నకు సమాధానంగా ప్రతికులమువారు, 'క్యూలో నిలబడి వారి చాన్సు తీసుకొనవలెననిరి. కమ్యూనల్ జి. ఒ. అమలు అంతబాధ ఇచ్చుచున్నదా అనగా బ్రాహ్మణేతరులలో ఇన్ని కులాలు ఉండుటయు, వారు ప్రతివారు ఉద్యోగము లడుగుటయు తమకుబాధ నిచ్చుచున్నదనియు మంత్రిగారు చెప్పిరి. అంత తలనొప్పి వచ్చిన మంత్రిగారు

### ప్రభుత్వం డబ్బు నిలవలు

స: అది ప్రత్యేకంచెప్పవలసినపనిలేదు.

ప్రభుత్వానికి 1946 మార్చి 31 వ తేదీనాటికి రూ 32,7581 కోట్ల డబ్బు నిలవయుండగా 4 కోట్ల రూపాయలు మార్కెట్టులో అప్పుచేయవలసిన అవసరం ఎందుకు వచ్చినదని మహమ్మద్ ఇబ్రాహీముగారు వేసిన ప్రశ్నకు ఆర్థికమంత్రి యీ విధంగా సమాధానం చెప్పిరి.

ప్రభుత్వంవద్ద 31 మార్చి '46 వ తేదీనాటికి రొక్కం లెక్కల క్రింద 310 09 లక్షలు మూడునెలల ట్రెజరీబిల్లుల సెక్యూరిటీలు 49 96 లక్షలు కేంద్ర ప్రభుత్వంవద్ద డిక్కాలపు సెక్యూరిటీలు 2915.14 లక్షలు మొత్తం 3275.19 లక్షలు ఉండిన విషయం వాస్తవమే. పైన తెలిపిన కాలపరిమితిగల సెక్యూరిటీలను వెంటనే డబ్బు చేయాలంటే మార్కెటులో సుముఖ పరిస్థితి ఉంటే తప్ప ప్రభుత్వానికి నష్టంరాకుండా వాటిని అమ్మడం సాధ్యపడదు.

పెట్టుబడి పనులకనిగాని లేక 1946-47 సం॥ బుణాలు అదాయవ్యయాలకుగాని సరిపుచ్చుటకేమాత్రం యీ నాలుగు కోట్లు బుణముచేయు అవసరం ఉండలేదు. అయితే యీ క్రింది కారణాల నుద్దేశించి పై బుణమును ప్రభుత్వం తీసుకోదలచినది. ఆ సంవత్సరంలో విశేషధనము అతి తక్కువ వడ్డీకి దొరుకుచుండెను. చాలా తక్కువ వడ్డీకి విశేషంగా పైకం లభించే అవకాశము వల్ల ప్రజోపయోగ కరమగు యుద్ధానంతర అభివృద్ధి ప్రణాళికలు ఎక్కువగా నిర్వహించ వచ్చుననే తలంపుతో ప్రభుత్వం యీ అప్పు చేయ నెంచినది. తమ వద్దగల సెక్యూరిటీలు అమ్మి లభించే పైకం కంటే తక్కువ రేటుకు మార్కెటులో అప్పుడు విశేష పైకం చేకూరు చుండినందున ప్రభుత్వ వారు తమ నిలవలలో సెక్యూరిటీలు తాకకుండా మార్కెటులో బుణమును తీసుకున్నారు. ఆ బుణమునకు సాలుకు 2¾% మాత్రమే వడ్డీలు యివ్వబడుచున్నవి.

ప్రకాశంగారి మంత్రివర్గ కాలంలో పేపరుమిల్లులు ప్రారంభించుటకు ఎన్ని లైసెన్సులు యిచ్చినారనియు, అందులో ప్రభుత్వంవారు లేమైనా వాటాలు తీసుకొన్నారాయనియు, ఆ లైసెన్సులకు పరిశ్రమల బుణసహాయ్యచట్టం క్రింద ప్రభుత్వం ఏమైనా బుణమిచ్చినదా యనియు, ఆ మొత్తా మెంతయనియు మహమ్మద్ ఇస్మాయిల్‌గారు ప్రశ్నించిరి.

పై ప్రశ్నకు యీ క్రింది సమాధానం యివ్వబడెను. పేపరుమిల్లు స్థాపించుటకు ఏట్టి లైసెన్సు అక్కరలేదు. ఈ రాష్ట్రంలో పేపరుమిల్లులు ప్రారంభించడంగూర్చి వెనకటి మంత్రివర్గము ఏ విధమైన ఉత్తరవులుగాని చేయలేదు. దీనిబట్టి (బి. సి.) ప్రశ్నలకు అవకాశంలేదు.

## చిత్తూరు జిల్లాలో బెల్లము కంట్రోలు
### రైతు మహాసభ తీర్మానములు

చిత్తూరు, సెప్టెంబరు 15: బెల్లము కంట్రోలు నెత్తివేయుటకును ధాన్యసేకరణలో అధికారులు రైతులకు కలిగించు కష్టనష్టములను వెల్లడించి యుద్యోగస్థుల దౌర్జన్యచర్యలను ఖండించుటకును నిన్నటి రోజున చిత్తూరుజిల్లా రైతులు సుమారు వేయిమందికిపైగా చేరి మునిసిపల్ ఆఫీసు కాంపౌండులో గొప్పసభ జరిపిరి. అధ్యక్షపదవిని వహించుటకు అంగీకరించియుండిన శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు సకాలములో రానందున ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుసంఘ ఉపాధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డిగారు అధ్యక్ష స్థానము వహించిరి. అఖిలభారత కిసాన్ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ ఎన్. వెంకట్రామానాయుడుగారు సభను ప్రారంభించిరి. అంతలో శ్రీ బలరామకృష్ణయ్యగారు మదరాసునుంచి వచ్చిరి. శ్రీ బలరామకృష్ణయ్యగారు అత్యంత గంభీరముగా ఉపన్యసించుచు రైతులు తమ కేర్పడిన నష్టములను తొలగించుటకు విధి విధానములేక ఆందోళన చేయవలెనని చెప్పిరి. కాంగ్రెసుసంస్థను తద్వారా ప్రభుత్వమునున్నూ స్వాధీనపరచుకొని ధనికులను జమీందార్లను అణగద్రొక్కి రైతు, కూలి, ప్రజారాజ్యమును స్థాపించుటకై గాఢప్రయత్నము చేయవలెనని కోరిరి. తాము మదరాసుకు వెళ్లి బెల్లం కంట్రోలును తీసివేయించుటకై మంత్రివర్గముతో రాయబారములు జరిపెదమని హామీ యిచ్చిరి. అటుపిమ్మట సభోద్దేశములు ఫలప్రదము కావలెనని కోరుచు ఆచార్య రంగాప్రభృతులు పంపిన సందేశములు ఈసభలో చదువబడెను. ఈ క్రింది తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

బెల్లమునకు నిర్ణయించిన కంట్రోలును వెంటనే తొలగించి రైతులకు పర్మిటుల నిప్పించవలెనని ప్రభుత్వమును కోరుచు ఇందులకై ప్రభుత్వమువారితో రాయబారము జరుపుటకై శ్రీ పోలకల రామచంద్రారెడ్డి, శ్రీ యన్. వెంకట్రామానాయుడు, శ్రీ పి. నరసింహారెడ్డి, శ్రీ పి. తిమ్మారెడ్డి, శ్రీ చంగల్రాయనాయుడు,

[illegible] మయినవి.

## ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ సభ్యత్వ గడువు

గుంటూరు, సెప్టెంబరు 18: ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వ గడువు యీ నెల 30 వ తేదీతో తీరిపోతుంది. కనుక ఆయా సంఘాలవారు రాష్ట్ర కోటాను జిల్లా కోటాను పంపించుతూ, పుస్తకములు సభ్యుల లిస్టులు అన్నీ రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు కార్యాలయమునకు పంపవలయును. మహాసభలు అక్టోబరు 11, 12 తేదీలలో తప్పనిసరిగా గుంటూరులోనే జరుగును. కాబట్టి అక్టోబరు 6 వ తేదీలోపల స్థానిక సంఘముల ఎన్నికలు జరుపుటని మహాసభలకు 25 సభ్యులకొక ప్రతినిధి చొప్పున ఎన్నుకొని ఎన్నికలిస్టులను విధిగా కార్యాలయమునకు పంపగోరుచున్నాను. అట్లు పంపని లిస్టులు అంగీకరింపబడవు. యీ విషయమై ఆయా జిల్లా విద్యార్థి కాంగ్రెసు సంఘమువారున్నూ రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు కార్యవర్గ సభ్యులున్నూ తగు శ్రద్ధవహించి కార్యక్రమము చురుకుగా తొందరగా జరుగునట్లు చూడవలసినదిగా హెచ్చరించుచున్నాను.

అనేకమంది సభ్యత్వ పుస్తకములు చాలలేవని, పంపమని ఉత్తరములు వ్రాయుచున్నారు. గనుక ఎవరికి ఎన్ని ఫారాలు కావలసింది వివరములతో సహా వ్రాసి పంపెదము. అని ఆం. రా. వి. కాం. కార్యదర్శి ప్రకటించుచున్నారు.

## పత్తికొండ తాలూకా ఆహార సంఘ సమావేశం

పత్తికొండ, సెప్టెంబరు 15: ఈ తాలూకా ఆహార సంఘ సమావేశము నిన్న నిక్కడ జరిగినది. అధ్యక్షులుంగాని శ్రీ కార్యదర్శిగాని హాజరు లేనందున శ్రీ ఎస్. నరసింహారెడ్డిగారు అధ్యక్షత వహించిరి. కర్ల హెచ్చు బోనసుతో సమానంగా మెట్ట ధాన్యములకూ బోనసు అనగా రు. మణువు 1 కి 1-0-0 చొప్పున నివ్వవలెనని, యీ సంవత్సరము యింతకు ముందే ధాన్యమిచ్చిన వారికి కూడా బోనసు యివ్వవలెనని, మిగులున్న గ్రామముల నుండే ధాన్యము తీసుకొనవలెనని, వెంటనే 1000 పంచులు మెట్ట ధాన్యము, 800 పంచులు వడ్లు శ్రీ జిల్లా కలెక్టరు సప్లయి చేయవలెనని తీర్మానించిరి. కిరసనాయిలు కోటాను హెచ్చించవలెనని తీర్మానించుచూ, పంచక విధానము గూర్చి లోగడ జరిగిన తీర్మానముల కనుగుణ్యంగా చర్య జరుగకుండుటకు తీవ్రముగా విమర్శించుచూ తీర్మానించిరి.

## ఉప్పురైతుకూలీల ఇబ్బందులు

బెజవాడ, సెప్టెంబరు 18: ఉత్తర విశాఖజిల్లా నౌపడ ఉప్పురైతుకూలీ కాంగ్రెసు సంఘకార్యదర్శి శ్రీ బి. ఎం. రెడ్డిగారీ క్రింది ప్రకటన చేయుచున్నారు.

ఉప్పురైతుకూలీలు కృషిచేసి ఉప్పు పండింతురే కాని ఆ పంటపైని వారికెటువంటి హక్కులేదు. వారు పూర్తిగా 'లెస్సీ' దయాదాక్షిణ్యంమీద ఆధారపడి ఉండవలసివచ్చుచున్నది. ఈ 'లెస్సీ' ఉప్పురైతు కూలీలను హింసిస్తున్నారు. ఉప్పురైతు కూలీలు సుఖపడవలెననిన యీ 'లెస్సీ' విధానము అంతరించవలెను. ఉత్పత్తి సహకారపద్ధతులమీద జరుగును. ఆ భూములపైని ఉప్పురైతులకు సాగు హక్కు ఉండవలెను. ప్రజలకు అందుబాటులో నుండవలెనని ప్రభుత్వము ఉప్పు పన్ను తొలగించినది. కాని వర్తకులు మాత్రము ఉప్పుధరను విపరీతముగా పెంచి ప్రజలకు ఇబ్బంది కలుగచేయుచున్నారు. ప్రజల ఇబ్బందిని తొలగించవలెననిన ఉప్పును సహకార సంఘముల ద్వారా ప్రజలకు అందించవలెను. త్వరలో అఖిలభారత ఉప్పురైతుకూలీల మహాసభ నౌపడాలో జరుపుటకు నిశ్చయింపబడినది. పై సమస్యల నెదుర్కొనుటకు వివిధప్రాంతములలో ఉప్పురైతుకూలీ కాంగ్రెసు సంఘములస్థాపించి మహాసభను విజయవంతము చేయవలసినదని కాంగ్రెసు సేవకులను, నాయకులను కోరుచుంటిని.

## క్రొత్త బియ్యం మరలు
### ఫిర్కా దేవలపుమెంటు ప్రాంతాలగూడ స్థాపింతురు

మదరాసు, సెప్టెంబరు 16: గ్రామపునరుద్ధరణ స్కీము ప్రకారం ఏర్పాటుచేసిన ఫిర్కాల వెలుపల ప్రాంతాలందు క్రొత్త బియ్యం మరలు స్థాపించరాదని 1.8.47 తేదీ ప్రభుత్వ ఉత్తరువు రద్దుచేయబడింది. 1947 డిశంబరువరకు సదరు ఫిర్కాలందు మాత్రం యీ క్రొత్త మిల్లుల నిషేధపు అమలునందుండును.

చేదంపుడు బియ్యం వాడుక ప్రోత్సహించుటకై యీ నిషేధం వెనుక అమలు జరిపియుండిరి. అప్పట్లో జాపాను రకం మిల్లులు "రామా మిల్లులు" అన్నవి తయారు చేయించి ఆ ప్రాంతాలందు యివ్వదలచియుండిరి. అవి తయారు చేయించుటకు చాల ఖర్చగుననియు, అట్టే ఉపయోగపడవని తరువాత తెలిసెను. కనుక అవి తయారు చేయించరు.

చేదంపుకు బియ్యం తగినన్ని తయారు కానపుడు క్రొత్త మిల్లులకు లైసెన్సు లివ్వకపోవుట చాల ప్రతిబంధకంగానుండనియు, చేదంపుకి తగినంతమంది కూలీలు లభించుట లేదనియు, ఉన్న మిల్లులు చాలవనియు ప్రభుత్వానికి తెలుపబడినందున యిట్లు చేసిరని ప్రకటించబడెను.

### కార్యాలయం మార్పు

మదరాసు, సెప్టెంబరు 15: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి ఇలా ప్రకటిస్తున్నారు:

ఆంధ్రరాష్ట్రరాజకీయ, మహాసభ సందర్భంలో తాత్కాలికంగా మద్రాసుకు మార్చిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయం తిరిగి బెజవాడకు మార్చడమైనది. ఇకమీద ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపదలచినవారు బెజవాడకే వ్రాయవలెను.

## చీరాల రెడ్‌క్రాస్ సొసైటీ సభ
### విరాళములకై గుంటూరుజిల్లా కలెక్టరుగారి విజ్ఞప్తి

చీరాల, సెప్టెంబరు 12: ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ స్థానిక శాఖ సాధారణసభ గత బుధవారం కలెక్టరుగారి అధ్యక్షతను జరిగినది. గౌరవ కార్యదర్శి డా॥ జైత రాఘవరావు గారు వార్షిక నివేదికను సమర్పించి స్థానికసంస్థ ప్రజలకు సేవచేయుటకు గాను అవకాశమిచ్చి వార్షిక సభ్యులుగా చేరమని విజ్ఞప్తిగావించిరి. అధ్యక్షులవారు ఉపన్యసించుచు రెడ్‌క్రాస్ సంఘముల యొక్క సేవను ప్రశంసించుచూ కార్యదర్శిగారి విజ్ఞప్తిని బలపరచిరి. సంఘాధ్యక్షులు శ్రీ ఏటుకూరి రామయ్యశ్రేష్ఠిగారి వందనసమర్పణముతో సభముగిసినది.



### నోటీసు

బెజవాడ సబ్ కోర్టులో
S. C. 148/1942. E. A. 555/1946.

అసలు వాది: ఆలపాటి రామమూర్తి.
ట్రాన్స్‌ఫరు డిక్రీహోల్డరు:
కోనలమూడి వెంకటేశ్వరరావు
2.వ ప్రతివాది: గంగిరెడ్ల కృష్ణమూర్తి

ఈ నెంబరులో 2.వ ప్రతివాదికి C. P. C. O. 21 R 16, 22 ప్రకారం నోటీసులునిమిత్తం 22-9-47 తేదికి వాయిదా వేసినారు. ఆక్షేపణ లున్న యెడల వాయిదా రోజున పగలు 10 గంటలకు బెజవాడ ప్రిన్సిపల్ సబ్ కోర్టువారి యెదుట హాజరై మనవిచేసుకోవలెను. లేనిచో కోర్టువారిచే అనంతర గ్రంథమును వుత్తరువు లివ్వబడును.

పాటిబండ సుందరరావు,
ట్రా. డిక్రీ హోల్డరు వకీలు.



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.